# ఉదయ కిరణాలు

(కవితా పద్య సంకలనం)

పెద్ది సాంబశివరావు



అభ్యుదయ భారతి (రిజిష్టర్డ్)
నరసరావు పేట

# ఉదయ కిరణాలు

(కవితా పద్య సంకలనం)

పెద్ది సాంబశివరావు

అభ్యుదయ భారతి (రిజిష్టర్డ్)
నరసరావు పేట
గుంటూరు జిల్లా (ఆం.ప్ర) 522 601

ఉదయకిరణాలు
పెద్ది సాంబశివరావు
1985

మూల్యం : రు. 3-00
ముద్రణ : వాసవి ప్రింటర్సు, నరసరావుపేట

UDAIAKIRANALU
PEDDI SAMBA SIVA RAO
1985
Price Rs. 3-00

మాటలను పాటలు చేసి
ప్రాణంపోసే
సంగీత శిల్పి పత్రి జగన్నాధరావుగారూ

అందుకోండి
అంకితం.

నిన్న, నేడు.... రేపు

సాహితీప్రియుల కలయికతో, సాహిత్యాభిమానుల ప్రోత్సాహంతో 1978లో 'అభ్యుదయ భారతి' ఆవిర్భవించింది. నాటినుంచి నేటివరకు వివిధ సాహిత్యాంశాలపై ప్రముఖుల ప్రసంగాలు, చర్చలు, కవితా సమ్మేళనాలు, సన్మానాలు, స్మారక సభలు, గ్రంథప్రచురణ వంటి కార్యక్రమాలను యధాశక్తి నిర్వహిస్తోంది.

1980 ఆగస్టు 15 న స్థాపక అధ్యక్షులు కొప్పరపు సత్యనారా యణగారి ప్రోత్సాహంతో కవితా 'కదంబం' వెలువడింది. దీనికి సముచిత ఆదరాభిమానాలు లభించాయి.

1984 లో మధురకవి నాళం కృష్ణారావుగారిని గూర్చి చిటిప్రోలు సుబ్బారావుగారు పరిశోధించి వ్రాసిన గ్రంథం ప్రచురించబడింది.

ప్రస్తుతం పెద్ది సాంబశివరావుగారు రచించిన 'ఉదయ కిరణాలు' అనే ఈ పద్య కవితా సంకలనం వెలువడుతుంది.

తరువాత 'వ్యాస కదంబం' ప్రచురించడానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి. ఇందుకుగాను దివాకర్ల వేంకటావధాని, ఆకురాతి పున్నారావు, జ్వాలాముఖి కీ॥ శే॥ గుర్రం మల్లయ్య, ప్రభృతుల వ్యాసాలు, మరికొన్ని పరిశోధక వ్యాసాలు సేకరించబడ్డాయి.

సాహిత్యాభిమానులు ఈ సంస్థకు చేయూత నిస్తారని ఆశిస్తూ.

మీ

అభ్యుదయ భారతి.

# కవితకు ప్రాణమొస్తే....

మదిలో మెదలిన భావనలు
ధరించెను అక్షర రూపములు.
అక్షరాలు పదములై
పదములే కవితలై
మిగిలిపోయె నెన్నాళ్ళో
కాగితాల మడతలలో
అక్షరాలు స్వరములయి
పదములు పల్లవులై
గాయక గళమున వెలువడ
పొంగి పోయె కవిహృదయం
తన కవితకు ప్రాణమురాగా.

# తోటమాలి

ఏమాలి పెంచెనో ఈ లేత అంట్లను,
ఏమిచ్చి సాకెనో ఈ పండ్ల మొక్కలను
గారాల నీడలో స్వేదాల నీరోసి
ప్రేమానురాగాల ఎరువులే వేసెనా
త్యాగాల తెరగట్టెనా తెగుళ్ళేవీ సోకకుండా
నల్గురికీ నీడనూ, పదిమందికీ పండ్లను పంచే
ఈలేత అంట్లను ఏమాలి పెంచెనో
ఇంత సుందరంగా, ఇంత సుకుమారంగా
ఏ తల్లి పెంచెనో ఈచిన్ని పాపలను.

## స్నేహం

ఇద్దరు వ్యక్తుల్లో
ఒకరి బాధ
ఇంకొకరి బాధగా
ఒకరి హాయి
మరొకరి హాయిగా
అనిపిస్తే
వారే మిత్రులు
విరుద్ధంగా అనిపిస్తే
వారే శత్రువులు.

## యాత్ర

స్థిరమైన రోడ్డుపైన
చరమైన వాహనంతో
జడమైన చెట్లను దాటుతూ
చేతనుడైన మనిషి
సాగించేది జీవనయాత్ర.
దారివెంట మైలురాళ్ళు
కాలానికి కొలరాళ్ళు

## ఇంజనీరు

ఎండే గొంతులు తడపడానికి
మండే కడుపులు నింపడానికి
కట్టే వారధికి సారధి ఇంజనీరు.
ఆతని నిజాయితీ నీరుకారితే
కారే కన్నీళ్ళకు కాల్వలు చాలవు.

**పరిమితి**

ఎందుకోయ్ సాగరుడా
అహంకారం నీకు !
నదుల శీలాన్ని బలిగొన్నా వనా!
ఆ జీవితాలను నల్లగా మార్చినందుకా!
తీపి మనసులను ఉప్పగా చేశావనా !
ఎందుకు నీకి అహంకారం !
నీ బలానికి పరిమితులున్నాయి గుర్తుంచుకో
నిరంతరం ప్రయత్నిస్తూ, నీ అలలతో హింసిస్తూ
ఆ బండరాతిని ఒక్క వీసం కదల్చలేకపోయావు.
ఇంకా ఎందుకు గర్జిస్తావ్,
తల వంచుకు వెనక్కు పోవోయ్ ....

## జీవన చదరంగం

సాగుతుంది చదరంగం
పావుల మారణహోమం
ఈ రణంలో, మారణంలో
యుక్తులు, కుయుక్తులూ
బహుకసి, పరమదురుసు

తోడులేని తెల్ల రాజు
నల్ల సేనకు బందీకాగా
రణం ముగిసింది.
ఒకరి ఖేదం మరొకరి మోదం.
చంపిన జీవులు గాఢ నిద్రలో
చంపబడినవి శాశ్వత నిద్రలో
కలసిమెలసి కలలు గంటున్నాయి.

ఈ లోకంలో జీవులు
చదరంగంలో పావులు
ఒకే చోటునుంచి వచ్చేవి
ఒకే చోటుకు వెళ్ళేవి
మధ్యలోనే యుద్ధం.
తెలుపు నలుపుల యుద్ధం.

# ఆ నవ్వు

నా రైలు పరుగెడుతుంది.
అంత కంటే వేగంగా
కవితకు విషయం వెదుక్కుంటూ
నా చూపులు వరుగులు తీస్తున్నాయి.
మైళ్ళు దాటిపోతున్నా
సంకెళ్ళు పడలేదు కళ్ళకు.
ఓ వాగొడ్డున గేదెలు మేవే అమ్మాయి —
మోము నవ్వులో నాని పోతుంది –
టా.. టా.. అంటూ చేయూపుతుంది.
నా జవాబుకు వ్యవధివ్వక
రైలు దాటి పోయింది.
ఆ నవ్వు మాత్రం
నా కళ్ళ వెనక కూరుకు పోయింది.
ఏ గొప్పనటీ అనుకరించ లేని
నిజాయితీ నిండిన నవ్వు అది.

వీడ్కోలు

నా కలం కవితలు కూర్చలేక పోతుంది
కాంతి స్వరం వినిపించక.
తపన ఎందుకో తెలియక
తబ్బిబ్బు అవుతున్నాడు మానవుడు నాలో.
మైళ్ళుదాటి వచ్చినా ప్రస్ఫుటంగా
కన్పిస్తున్నాయి రంగులూ, రేఖలూ.
ఎవరితో కలసి పంచుకోవాలి
ఈ భావనా వెల్లువను ?
ఎవరితో చేయాలి సాహితీ చర్చలు ?
ఎవరింటి కెళ్ళి పిలవాలి 'మిత్రమా' అని ?
నాదం, అక్షరం, దృశ్యం, చిత్రం, స్నేహం,
పంచ ప్రాణాలను పంచుకు తీసుకోగా
ఆ జ్ఞాపకాల వేడిలో
'మదిలో మెదలిన భావనలు' ఆవిరై పోతున్నాయి.

ఎందుకో ?

ఎందుకు మానవా ఇంతటి తపన!

ఎంతగా వగచినా కోర్కెలు తీరునా ? **॥ఎందుకు॥**

సుందరాంగుల చెలిమిని కోరియా?
చలువ మేడలలో కులుకుట కొరకా?
నగిషీల నగలు, నాణెపు బట్టలు
నాజూకుగా నీవు ధరించుటకా?

పూటకు గుక్కెడు గంజే లేని

పేదల బతుకుల అతుకులు చూడు ॥ఎందుకు॥
ధనరాశులను దాచగ దలచియా?
పదవుల, కీర్తి పొందుట కొరకా ?
వింతవింతల వస్తువులన్నీ చెంత
చేర్చుకొని సంతసించేందుకా ?

మొలకు మూరెడు బట్టే లేని

బడుగు బ్రతుకుల బాధలు చూడు ॥ఎందుకు॥

ముసలెద్దు
తనను బండి ఎక్కించి తీసుకు వెళ్తుంటే
ఆ ముసలి ఎద్దుకు ఎంతో ఆనందంగా వుంది.
యజమానికి కృతజ్ఞతలు
చెప్పుకుంటుంది మనసులోనే.
అతి చిన్న కండగపు శక్తి గూడా ఉడిగే దాకా
సేవ చేసింది తాను -
అరక, బండి, కళ్ళం, గానుగ – ఎన్నోరకాలుగా -
ఈ మధ్యనే నడవలేక పోతుంది.
గత వైభవం నెమరు వేసుకుందా మంటే
పళ్ళపునాదులు సలుపుతున్నాయి.
యజమానికి మళ్ళీ కృతజ్ఞతలు చెప్పుకుంటుంది.
ఇంతలో బండి ఆగింది,
పశువులు ఆసుపత్రి వద్ద కాదు,
కసాయి వాడి ఇంటి ముందు....

## హక్కులు

కదలిరా, కదలిరా సోదరా!
సాధిద్దాం కోర్కెలు
ప్రకటిద్దాం ప్రతిఘటనలు
తీసుకొద్దాం విప్లవాలు
అందిద్దాం సందేశాలు
కదలిరా కదలిరా
లేవోయ్, తేవోయ్ రంగునీళ్ళు
ముంచేయ్, తడిపేయ్ కుంచెను
చెరిపేయ్ గోడలు
దున్నే వాడిదే భూమి
వ్రాసేవాడిదే గోడ.

## బంతిపూవు

ముంగిట ముగ్గులు, ముత్యాల ముగ్గులు
మెలికలు, చుక్కలు, తీగలు, గీతలు,
రంగులు, బొమ్మలు.వంగి లేచీ, లేచి వంగి -
ఒకరి కొకరు పోటీగా తీర్చిదిద్దిన రంగవల్లులు

అలసటా, బాధా,ఆ నడుము పోటూ
ఎటుపోయెనో గాని, తన ముగ్గును
తేరి చూడ ఇంతి మోము వికసించెను
ముద్దబంతి పూవు వోలె.

# నైరాశ్యం

‘‘కొత్త ఏడాదీ, ఇదుగో ఒక మాట”
అని పిలిచి చెపుతుంది పాత ఏడాది
“త్వరపడకు చెల్లీ, పన్నెండు మాసాలు పాలించవచ్చు
ఎవరింటి కెళతావు ముందుగా, చదువుల తల్లి దగ్గరకా?
వెళ్ళకు, ఆమె ఇంట్లో లేదు
విద్యార్థుల మెదళ్ళలోకి చేరాలని
విశ్వ ప్రయత్నం చేస్తుంటే
ఆమె తల పగల గొట్టి ఆసుపత్రిలో చేర్చారు
విద్యార్థి సంఘాల నాయకులు.
అమ్మ సరస్వతి ఆచూకి చెప్పడానికి అయ్యవార్లు
ఎవరూ తీరిగ్గా లేరు -
లక్ష్మీదేవి ఇంటికి వెళతావా !
అష్టలక్ష్ములలో ఎవరింటికి?
ధనలక్ష్మికి క్షయవ్యాధి,
పదిహేడు శాతం బరువుతో కృశిస్తుంది.
కల్తీలన్నీ కలసి ధాన్యలక్ష్మిని కురూపిని చేస్తే
ఆకాశవాణిలో పసిడి పంటలు వింటూ ఆక్రోశిస్తుంది.
గృహలక్ష్మి గుడిసెకు నిప్పంటుకుంటే
బావులు తవ్వడానికి టెండర్లు పిలవబోతున్నారు.
సంతానలక్ష్మి మాత్రం కులాసాగా ఉంది.
ఎక్కడ చూసినా ఆమె ప్రతిరూపాలే
కానీ, పోలికలు మాత్రం ‘పెద్దమ్మ’ వి
నీ ఇష్టం, ఎవరింటికైనా వెళ్ళు
పార్టీ ఫిరాయించకుండా రమ్మన్నది పాతఏడాది.

మగనిదారి

(సప్తాక్షరి)

భర్తతో భార్య :

సానిదాని దారి మాని
నీ మానిని దారిని పద
పాపమని, సాగనిదని
నీ సగమని, సరిదానిని గని
పగమాని, దారి మారి పద
సదా నీ పాదమాని మనిద **॥దారి॥**

మామగారి పగ గాదని
నీ మదమని నీ పాపనిగని
నీ దాని సరి మగనిగా
గరిమగా, మగసరిగా **॥ దారి ॥**

మరి మరి, పరి పరి, నీ నిసా మాని,
నీ దగామాని, మామ గారిని గని
సాని దారి మారి, సరిదారిని పద
సమసారి దారిని సరిగా పద. **॥ దారి ॥**

# నా చెలి

(మూలం: హిందీ సినిమా పాట)

చందమామను నేను అడిగాను
నా ప్రియురాలి కంటె
సౌందర్యవతిని చూశావా? అని.
వెన్నెల సాక్షిగా లేదు .... లేదు ....
అన్నాడు చంద్రుడు.

తోటను అడిగాను
నాప్రేయసి కంటె
సుకుమారిని చూశావా అని.
మొగ్గల సాక్షిగా .... లేదు లేదు ....
అన్నది తోట.
మధు పాత్రను అడిగాను
నా ప్రియతమ కంటె
మత్తైనదేదైనా ఉందా అని.
నిషా సాక్షిగా... లేదు లేదు ....
అన్నది మధుపాత్ర.
కవిని అడిగాను నా చెలిని మించిన
ప్రేరణను చూశావా అని.
కవిత సాక్షిగా .... లేదు . లేదు .... ....
అన్నాడు కవి.

# ఓ ప్రభూ నాకు ఇవ్వు

మూలం : రవీంద్రనాథ్ ఠాగూర్

ఓ ప్రభూ,
దిగంతాల కంటా వ్యాపించిన
పచ్చని వరిపొలాల ప్రశాంతత,
నిర్మల నీలకాంతిలో ప్రతిధ్వనించే నాదం,
శ్రావ్య సంగీతాన్ని వినిపించే నదీతీర సౌందర్యం
నాకు చాలా ఇష్టం.
ఈ పరిసరాల్లో
చల్ల గాలులూ, నీలాకాశం, నిర్మలకాంతి మధ్య
తృప్తి ఆనందం, ఉత్సాహాలను నింపుకొని ఉంది
నా కుటీరం.
కానీ
వీటన్నిటినీ అవతల పారేసే ధైర్యాన్ని,
నీ దూతవచ్చి పిలిచినపుడు
బాధా, మరణాల ద్వారా
నీ కార్యభారాన్ని సంతోషంతో
స్వీకరించ గల బలాన్ని
నాకు కల్గించు.

ఈ 'ఉదయ కిరణాలు' పెద్ది సాంబశివరావు రచించిన కవితలు, పద్యాల సంకలనం. గతంలో పలు వ్యాసాలు, జీవిత చిత్రణలు, ''ఫాదర్ డామియన్'' అనే గ్రంథ రచన, అనువాద అనుభవం కల రచయిత ఈయన.

"కాదేదీ కవిత కనర్హం" అన్నట్లుగా గోడలమీద వ్రాతలు. ముసలెద్దు, ముంగిట ముగ్గులు, అమాయకపు నవ్వు, ఆత్మీయతలు ఈయన కవితలకు వస్తువులు.

ఇంకా వైరాగ్యం, నైరాశ్యం, అక్షరాల గారడి వగైరాలూ ఉన్నాయి.

'కాంక్షగల్గి చేయ కానిదేదీ లేదని' చెప్పేవి ఈ పద్యాలు. గతంలో 'చదువుకుందాం' 'హేతువాదం' 'మార్గదర్శి' పత్రికలలో ప్రచురించబడిన ఈ పద్యాలు పాఠకుల పట్టుదలను పెంచి కార్యోన్ముఖులను చేయగలవని ఆశిస్తున్నాము.

ప్రకాశకులు.

Published by Abhyudaya Bharathi. Narasaraopet.
Guntur Dt.. 522601.
Printed at Vasavi Printers, Narasaraopet.

1. మంచి చెడ్డలుండు మనుజులందరియందు
పూర్తి మంచివాడు పుట్టడెచట
మనిషి యందు చూడు మంచిని మాత్రమే
నీకు సుఖము, శాంతి నిశ్చయంబు.

శ్రీరాముడు తన భార్యను అపహరించి, విరోధియైన రావణాసురునిలో కూడా కల మంచి గుణములను గుర్తించి గౌరవించెను.

కొన్ని పుస్తకాలు రుచి చూచి వదిలేయాలి.   కొన్నింటిని మింగేయాలి, మరికొన్నింటిని నమిలి జీర్ణం చేసుకోవాలి. అన్నారు ప్రముఖ కవి, బేకన్
నిన్ను బాగా ఆలోచింపజేసే పుస్తకాలే నీకు బాగా మేలు చేసే పుస్తకాలు. ధియొడర్ పార్కర్
విజ్ఞానానికి మూలధారం పుస్తకాలు.   విజ్ఞానం ద్వారా మాత్రమే నీకు బలం, తాత్వితక, నిజాయితీ, బుద్ధికుశలత లబిస్తాయి. అన్నారు మాక్సిమ్  గోర్కీ.
మంచి పుస్తకాలకంటే పిల్లలకు గొప్ప విజ్ఞానాన్ని అందించుటలో పుస్తకాలు కల్పవృక్షాలు. పుస్తకాలకు మించిన అక్షయపాత్ర లేదు. అలాంటి గ్రంథాలను గురించి ఈ పద్యం విందామా?

2. మంచి మిత్రువోలె మంచి పుస్తకములు
అరుదుగానె దొరుకు అచట నచట
కదమ వెల్ల గూడ కాలవ్యయమునకే
తెలిసి చదవవోయి తెలివితోడ.

మనిషి ఆదర్శంగా తీసుకోవలసిన వాటిలో చిన్న ప్రాణులైన  చీమలు, తేనెటీగలు ముందుంటాయి. ముఖ్యం వాటినుంచి సంఘజీవన సూత్రాలు ఎలా గ్రహించాలో, ఎందుకో విందామా?

చీమలకు ఎక్కడైనా ఆహారము ఉన్న జాడ తెలిస్తే వెంటనే ఆ వార్త అన్నిటికీ చేరుతుంది. వరుస తప్పకుండా క్రమశిక్షణతో బారులు. పనులు ప్రారంభం. అందినన ఆహారాన్ని కడుపు పగిలేలా తినవు.నిల్వ చేసుకుంటాయి.

అలాగే తేనెటీగలు పూవులనుంచి తేనె సేకరించితేనె పట్టులో దాస్తాయి.మనిషి ఎంత నాగరీకుడయినా చీమ, తేనెటీగలు వంటి చిన్నప్రాణులను చూసి నేర్చుకోవలసినవి చాలా ఉన్నాయి.

3. చీమ, తేనెటీగ చిన్న ప్రాణులయిన
సంఘజీవనమ్ము సలుపుటందు
మార్గదర్శులవ్వి మానవాళికి గూడ
కాని పనులు లేవు కలసి చేయ.

పనులు చాలా పెద్దవని పరిమాణాన్ని చూసి భయపడరాదు. ఆరంభించి మెల్లగా చేసుకుపోతుంటే అవే అవుతాయి. తేనీగ ఎన్నిసార్లు పుష్పము దగ్గరకు వెళ్లి తెస్తే ఒక చుక్క తేనె వస్తుంది? సోమరి మనిషిలా అలా అనుకోదు, భయపడదు. ఆలోచన వస్తే ఆచరణలో పెడుతుంది. మనిషి దీనిని కూడా ఆదర్శంగా తీసుకోవాలి.

4.ఎంత పెద్దపనియు కొంత కొంతగ చేయ
సులభమగును మరియు పూర్తి యగును
పనులు గొప్పవైన భయమంద తగదయ్య
మారు పూలపొడియె మధువు గాను.

అప్పిచ్చువాడు, వైద్యుడు, నీటి సౌకర్యము, సలహాదారు గల ఊళ్లోనే ఉండాలని
సుమతీ శతకకారుడు అంటే
ఈ రచయిత దుప్పటి ఉన్న వరకే కాళ్లు చాపుకో మంటున్నాడు.

5.అప్పు చేయునపుడు ఆనందముగ నుండు
తీర్చబోవ కలుగు తిప్పలన్ని
చివరి మార్గముగనె చేయుము రుణమును
అప్పు అధికమైన గొప్ప తరుగు.

మనుషులు ఒకే సారి అనేక పనులు చేయాలని ఆరాటపడుతుంటారు. అలా
చేసేటప్పుడు ముందున్న పనిమీదనే దృష్టి పెట్టాలి. అలాకాక ముందు లేని పని
గురించి ఆలోచిస్తుంటే ఆ పనీకాదు, ఈ పనీ కాదు.

6.అమ్మ గూర్చి తలచ కాటల పాటల
పనుల గొడవ వద్దు పడక ముందు
అటుల చేతువేని అదియు నిదియు చెడు
ఎచటి పనిని చేయు మచట బాగ.

పనిని చెప్పగానే నేను చేయలేను, నాకు చేతగాదు అనవద్దు. నేర్చుకోగలని ధైర్యంగా ముందుకు సాగితే క్రమంగా సాధించటం సాధ్యమే.

7.చేయలేను నేను, చేతకాదిది నాకు
పిరికి మాటలట్లు పలుక దగదు
చేసి చూడగలను, నేర్చుకోగలనంచు
సాగుమమ్మ నీవు  సరళదారి.

కాలం గారడీ చేస్తుంది. నీముందు నుంచే జారి పోతుంది.  నువ్వు గమనించలేవు. జాగ్రత్త చెపుతుందీ పద్యం

8.నిన్న మారిపోయె నిప్పుపై బూదిగా
కాలనట్టి కట్టె రాని రేపు
నేడు కలదు ఎదుట నిజమగు నిప్పుగా
వాడుకొనుము దాని విలువ నెరిగి.

శాస్త్ర, సాంకేతిక రంగాల వృద్ధి వల్ల ఎన్నో ఆవిష్కరణలు వచ్చాయి, వస్తున్నాయి. వాటికి తగిన వేగంలో ముందుకు సాగకపోతే వెనకపడి పోతాము.

9. వీడియోలు, చిప్సు,  రాకెట్లు, రోబోలు
కార్డు పంచి, టీవి కన్నులెదుట
రిగ్గు, ఎయిరు బస్సు, మిగ్గు, కంప్యూటర్లు
వేగమెరిగి నీవు వెళ్లు బిడ్డ.

ఎన్నికలలో పోటీ చేసే వారి ఇంటికి వెళ్లి జేజేలు కొట్టే వాళ్లు చాలామంది ఉంటారు. అప్పుడు అభ్యర్థి తనను గొప్పగా ఊహించుకొని ఉబ్బిపోతాడు. ఎన్నికలో ఓడితే ఎవ్వరూ కనపడరు. అభ్యర్థి మంచం పడతాడు. అలా పక్కవారి పొగడ్తలు, విమర్శలు పట్టించుకోకుండా తమ దారిన తాము పోవాలి.

10. పరులు పొగడగానె పెరుగదు నీ కీర్తి
వారు తిట్టినంత తరుగ దదియు
నీదు లోటుపాట్లు నీవె తెలుసుకున్న
ఎవ్వరేమియన్న ఎగిరిపడవు.

కుందేలుకు కొమ్ములు ఉంటాయని, దానికి మూడు కాళ్లే అని అర్థం లేకుండా వాదించే వాళ్లు తారసపడుతుంటారు. వాళ్లకు నచ్చ చెప్పలేము. చూపినా అంగీకరించరు. అలాంటి వారితో వాదనలు మాని మన దారిన మనం పోవటం మంచిది.

11. మొండి వాదనలతొ మొరటుగా మాట్లాడు
వాని మార్చలేరు ఎవరు గూడ
మంచి తర్కమైన మంటలోన గలుపు
వాని గూర్చి నీవు వగచ నేల.

ఏ పనిని నేర్చుకోవాలన్నా మొదట్లో తప్పులు చేయటం సహజం. తప్పులు జరుగుతున్నాయని పని చేయక పోవటం వివేకం కాదు.

12. తప్పు కొట్టకుండ టైపు చేయగలేము
పడక, లేవక, నడక నేర్వలేము
ఆదియందు తప్పు అందరికి దొర్లు
తప్పు గూర్చి చింత తగదు నీకు

13. ధనము దాచవచ్చు, ధర నప్పు తేవచ్చు
సమయమట్లు చేయ సాధ్యమవదు
రెప్పపాటు నైన గొప్పగా వాడ నేర్వు
ఘడియ విలువ దెలిసి గడుపు మయ్య.

14. ఎంతొ తెలివి యుండి కొంత గర్వమున్న
మంచి అంత పోవు మంట గలసి
అహము వలన మంచి అంతరించునయ్య
కుప్ప గడ్డి యందు నిప్పు వోలె.

15.అవును నీకు కలవు హక్కులు ఎన్నియో
అందరికిని వుండు నటుల చాల
పరుల హక్కులేవి భంగ పరచుటకు
హక్కు నీకు లేదు హద్దు లెరుగు.

16.ఎంతొ తెలివి యుండి కొంత గర్వమున్న
మంచి అంత పోవు మంట గలసి
అహము వలన మంచి అంతరించునయ్య
కుప్ప గడ్డి యందు నిప్పు వోలె.

17.నొసలు చిన్నదనియో, నోరు పెద్దదనియో
నల్ల రంగు జూచి, తెల్ల జుట్టు
దలచి వగచి ఫలము లేదు  గాన నేర్చుకో
మార్చలేనివాని మెచ్చుకొనుట.

18.గుణము, వర్తనమ్ము, గుర్తెరుగు వరకు
మంచి చెడ్డలనుచు మనుజులందు
కులము, మతము జూచి విలువలు గట్టకు
మేడిపండ్లు ఉండు మెండుగాను.

19.లేదు లేదు అనుచు ఏడ్వ నేమి ఫలము?
లేమి పెరుగుగాని కలిమి రాదు
నీకు యున్నవాని నేర్పుగా వాడుకో
జయము కలిగి తీరు జనుడ నీకు.

20.తనను గూర్చి తాను తక్కువగ దలచి
ఆత్మవిశ్వాసంబు కోలుపోయి
వగచు వారి కంటె వికలాంగులే లేరు
అట్టివారి కడకు అరుగ దగదు.
21.ఎదుటి వారినెపుడు  ఎగతాళి చేయుచు
మనసు నొచ్చునట్లు మాటలొద్దు
నిన్ను మించు వారు ఉందురు ఎందరో
గర్వపడుట తగదు యుర్వి యందు.

22.పేదతనము మరియు పెంపక లోపాలు
కుంటి, చెముడు, మూగ, గుడ్డి అయిన
ఆత్మబలం యున్న అడ్డుగా రాలేవు
ఆశయంబు కలిగి పాటుపడిన.

23. మనిషి ఎంతవాడు, మత్త గజమదెంత?
నమ్మగలమె కోడి రామమూర్తి
గుండె మీద మోసె గున్న ఏన్గు నన్న
పెరుగు నయ్య బలము పనిని చేయ.

24.మంచిమాట వల్ల మానును గాయాలు
తొలగిపోవు నెన్ని తగవులైన
ఉన్న బాధ తొలగి ఊరట కలుగును
మంచి భాష తెలిసి మాటలాడు.

25.మాటలాడు టొక్క మంచి వరమె కాని
ఎదుటి మాట వినుట చాల మిన్న
శ్రద్ధతోడ వినుము సరివారు మాట్లాడ
వారి భావములను ఎరుగ గలవు.

26. జీవితమున చాల చవిచూసి ఓటముల
లింకనైనాడు అమెరికా  అధ్యక్షుడు
చర్చిలైనాడు బ్రిటనుకు ప్రధాని, ఓడినంత
ఆశయంబు నీవు వదల వలదు.

27.హానిమన్ వైద్యుడై హోమియో కనుగొని
మందు, రోగములకు మధ్య గల పొత్తు
తెలిపి పడెను పెక్కు తెరగుల బాధలు
ప్రజల మేలు గోరి ప్రాణ దాత.

28.నీరు, నిద్రలేక తిరిగె రాష్ట్రమ్మంత
నటుడు నందమూరి నేత గాగ
జగతి ప్రజలు చకితులై చూసిరే
పనిని చేయ పిదప ఫలితముండు.

29.టెన్నిసాటయందు వన్నెకెక్కెను తండ్రి
అతని మించినాడు సుతుడు కూడ
మార్గదర్శకులైరి మాష్టరు కృష్ణన్ లు
పెద్దవారికి మరియు పిన్నలకును. (1985)

30.చదువు రాని మొద్దు అనబడ్డ ఎడిసను
ఎటుల కనుగొన గలిగె తెలియుమయ్య
కొత్త శోధనలను కొల్లగా వందలు
విసుగు లేక పనులు చేయు మటుల.

31.డైనమైటు నెరిగి డబ్బు సంపాదించి
కొంత నిల్వ జేసె శాంతి కొరకు
ఏర్పరచెను వివిధ నోబెల్ బహుమతుల
పరుల మేలుగోరి పంచు మట్లు.

32.తాటియాకు రాత మోటయి పోవగా
అచ్చు గొట్ట నేర్పె అందమొప్ప
గొప్పవాడు గాడె గూటెను బర్గు యున్
వేల పుస్తకాలు వెలుగు నింపె.

33.వస్తువేదయిన ద్రవములోన మునుగగా
దాని బరువు కొంత తరిగిపోవు
అట్టి సూత్రములను ఆర్కిమెడిసు తెల్పె
తపన గలిగి చూడ తెలియు నిజము.

34.కాయ రాలి పడుట కాంచెను న్యూటను
తర్కబుద్ధితోడు తా కనుగొనె
భూమి కూడ పెద్ద సూదంటురాయని
తరచి తరచి చూడ తట్టు నిజము.

35.కలదు మొక్కలకును జీవమనుచు
నరుల వోలె ఏడ్చు నవియు యనుచు
జగతి ప్రజకు తెలిపె జగదీశ చంద్రుండు
శాస్త్ర దృష్టి తెలుపు వాస్తవంబు.

36.పదవి ఏది రాక పరదేశమేగెను
జన్యుశాస్త్ర శోధ జరిపి తాను
గొప్ప వాడయె హరగోవింద ఖొరానా
ఓర్మి యున్న చోట కాని దేది?

37.పిచ్చి కుక్క కరువ ప్రాణాలు విడుచుచు
బాధ పడెడు రోగి వేధ జూసి
మందు చెప్పినాడు మహనీయ పాశ్చరు
అట్టి వారి దారి అభిలషణీయంబు.

38.తీగె లేక వార్త తాను పంపెదనన
అతని పిచ్చి వాడని అంత నవ్వ
మార్కొని చూపగలిగె మంచిదౌ రేడియో
మంచి పనిని నవ్వ మానబోకు.

39.తాము నమ్మినట్టి ఆశయాల కొరకు
ప్రాణమున్న వరకు పాటుబడిన
సంఘ సేవకులలొ సరియేరి గోరా కు
తలచి, చెప్పి, చేయు మొక్క రీతి.

40.మరణ బాధ తోడ మ్రగ్గెడు జనుల
తిరస్కార జనుల  సేవ జేసి
అమ్మ థెరిస్సా అందుకొనె పురస్కారముల
విశ్వ శాంతిదూత విజ్ఞురాలు.

41.చెవిటి, గ్రుడ్డి మహిళ హెలెను కీలరు
అవిటి వాండ్ర మేటి సేవ జేసి
దేశ దేశములలొ యశము గాంచెను భళా
సేవ సేయ కాదు వైకల్య మడ్డు.

42.మారణాయుధాల ముష్టి యుద్ధము నందు
కన్ను, కాలు పోయి, కష్టమొందు
సేన సేవ జేసె వనిత నైటింగేలు
ధనిక స్థాయి ఇల్లు వదలి వచ్చి.

43.ఈలపాటలు తెలుగు జోలపాటలుగాను
అరువదేండ్లు ఆడి నాటకాలు
కీర్తి గాంచినాడు కే. రఘురామయ్య
ప్రతిభ వెలికి తీయ ఫలితముండు.

44.సరిగమపదనిసల సంగీత ద్వారము
తెరచి వాయులీన తీగ ద్వార
నాద సృష్టిచేయ నాయుడు సరియేరి?
నేర్వవచ్చు కళలు నేత్రహీనులును.

45.గజ్జె కట్టి ఆడి గళమెత్తి గర్జించి
ఆదిభట్ల దాసు ఆంధ్రదేశ
వాశి పెరుగ జేసె హరికథా గానాన
విద్య నేర్చి ముందు వెల్లడించు.

46.ఆలి పరమ గడుసు టాల్ స్టాయ్ కు, జాన్సన్ కు
అయిన గాని వారు ఆగలేదు
గ్రంథకర్తలందు గొప్పవారయ్యిరి
కోర్కె గట్టిదైన కానిదేది?

47.చూపులేనివాడు చిలకమర్తి కవి
ఆంధ్ర, సంస్కృతాంగ్ల భాష లరసె
తెలుగు ప్రజకు కొంత వెలుగు చూపె
లోటు అడ్డమౌనె లోతు హెచ్చ.

48.భరతమాత కన్న భావనా వెల్లువ
విప్లవంబు గోరు వక్త యతడు
తళుకుమని మెరిసె తమిళకవి భారతి
బ్రతుకు యేండ్లు కాదు బ్రతుకు లెక్క.

49.కలము గీత శక్తి తెలుగు ప్రజకు జూప
నూత్న రీతి రాసినారు కవులు
గొప్ప కారె చలము, గురజాడ, శ్రీశ్రీ లు
జంక దగునె కొత్తదారి చూచి.

50.పదవ యేట నుండి పాడసాగె సభల
కృతుల వ్రాసి తానె కూర్పు జేసె
మధుర గానమూర్తి మంగళంపల్లియే
బాలమేధ జూపె బాలమురళి.

51.ఎల్ల లేని ఘనుడు వేంకటేశ్వరరావు
ఇరువదారు గంట లేక బిగిన
మ్రోగజేసె మృదుమృదంగములను
పట్టుబట్టి నేర్వ పనులు జరుగు.

52.బండ చెముడు యున్న బెథొవెన్ సృష్టించ
గలిగె నూతనంబగు స్వరముల
విశ్వజనుల కెల్ల వీనుల విందుగా
అవిటితనము చేయ అడ్డు రాదు.

53.పేద యింట బుట్టి బాధలనుభవించి
పూట గడిపి చదివె ఘంటసాల
ఆతడాయెను గద గాయక సామ్రాట్టు
దేశభక్తితోడ ఖైదు జేసె.

54.కొంచెమెత్తు తగ్గ కుంచిల్లగా బోకు
ఛత్రపతియు, శాస్త్రి, చాలా పొట్టి
అరయ వీరుడౌ నెపోలియన్ అంతేను
పొడుగు కాదు చేయు పనులు లెక్క.

55.బూర్జువాల పీడ బూడిదై పోవగా
విప్లవంపు శంఖు వూదినట్టి
మార్క్స్, లెనిను, మావో మామూలు మనుషులే !
చేయలేనిదేది చేవయున్న.

56.పొద్దు గుంకనట్టి ఆంగ్లసామ్రాజ్యమున్
హింసలేక సత్యహితము గానె
ఎదురు నిలిచి గెలిచె గాంధి మహాత్ముండు
శాంతి తోడ చాల చేయ గలము.

57.అమెరికాకు తాను అధ్యక్షుడాయెను
అంటరాని తనము నణగ దొక్కె
నిగ్రహంబు తోడ నిరుపేద లింకను
పట్టుదలగ జేయ పనులు కావె?

58.వెలికి నెట్టబడిన కులము నందున బుట్టి
చదువు బాగ చదివి చట్టమెరిగి
రాజ్య అంగములనె వ్రాసె నంబేద్కరు
ఎదనిండ కసి యుండ కానిదేది?

59.పాత్రమీది మూత పడిలేచుటను జూచి
జయము పొందినాడు జేమ్సు వాటు
తాను కనుగొనంగ ఆవిరి యంత్రంబు
తర్కబుద్ధి వలన తరుగు భ్రమ.

60.అజహరుద్దీన గునె ఆరంభశూరుడు
త్రిశతకములు వరుస బాద
బద్దలయ్యె గద ప్రపంచ మానాలు
ఓర్పు నేర్పులున్న ఒనరు నన్ని.

61.విశ్వవిజయులమని విర్రవీగి, పిదప
ఓడె చిత్తుగ మన క్రికెటు జట్టు
స్వంత నేలమీద ఇంగ్లాండు చేతిలో
పిట్టపిట్ట పోరు పిల్లి దీర్చె.

62.ఓడ, బుద్ధివచ్చి, ఓర్మిని కోల్పోక
ఐకమత్యముగను ఆట ఆడి
తెచ్చినారు మరల విశ్వజ్ఞాపిక మరల
ఓటమయ్యె గెల్పునకు పునాది.

63.గబ్బిలముల చేత గళమెత్తి పాడించి
ఖండకావ్యములను మెండు వ్రాసె
భాష తెలుగునందు జాషువా కోకిల
కలము నుండి కురిసె కరుణ రసము.

64.దూరదేశములకు కూడ హలో...హలో
యనుచు ఫోనుచేయ వీలు కల్గ
జేసినాడు వేత్త మైఖేలు ఫారడే
దీక్ష కలిగి చేయ కాంక్ష తీరు.

65.ఎంత కోపపడిన కొంతైన మారవు
వాన. ఎండ, కరువు వగయిరాలు
వాటి బారి పడక తొలగుట నేర్చుకో
చేతకాని యెడల బాధ మాను.

66.భావమెరుగలేని బండ చదువులేల
సత్యదృష్టిలేని రాతలేల
చిత్తశుద్ధిలేని చెత్త మాటలు ఏల?
జీవి లేని వట్టి దేహమటుల.

67.ఆశలుడిగినంత ఆనందమేముండు?
పెక్కు ఆశలుండి ఫలము లేదు.
మంచి ఆశయాల కొన్ని ఎంచుకొనుము
వాని చేరువరకు పాటు పడుము.

68.మంచి జరిగినపుడు మన గొప్ప యందుము
అన్ని తెలిసె ననెడు అహము తోడ
పనులు కాని యెడల పరులను నిందించ
ఎన్నడైన తగదు ఎరుగుమయ్య.

69.కామక్రోధ లోభము మద మత్సరములు
మోహములవె వైరులిహము నందు
వాని గెలువ గల్గు వాని కెదురు లేదు
పోరు జరుపవలయు వీరులైన.

70.తాటిచెట్టు ఎక్క తలదన్ను మరొకడు
ఘనత యైన కొలత హీనమగుచు
చిన్న దగును రేపు గిన్నీసు గ్రంథాన
పెద్ద తలచి ఎపుడు పెంచకహము.

71.బలము లేవు కలవు? బలహీనతలు ఏవి?
నీకు నీవె ఎంచి నిగ్గు తేల్చి
వాని పెంచుకొనుచు వీని త్రుంచుకొనుచు
సాగ, నీకు కలుగు సతత జయము.

72.భావికాలమందు తావి మిగులునట్టి
ఆశయంబు నెంచి అడుగు సాచ
అడ్డులెన్ని రాని, గడ్డు కాలము కాని
నీకు జయము కలుగు నిశ్చయంబు.

73.కారణాలు లేక కల్లమాటలు బల్క
కలుగునేమి ఫలము కాంచుమయ్య
తరుగు నీకు విలువ ఇరుగు పొరుగునందు
లొల్లి కూత విలువ లోక మెరుగు.

74.సొగసు పెంచ తలచి సోకు జేసు కొనుచు
రంగు బాగ రాసి రాజుననుచు
తలచి తిరుగ వయసు తరుగ దొక్క
ఏడు కూడ నీకు ఎంచి చూడు.

75.చుట్ట, బీడి, జరద, ఘుట్క, నశ్యములును
పొగయాకు రూపె పోల్చి చూడ
నమల, పీల్చ, కాల్చ నాశమౌ దేహంబు
వాని జోలి కేగ వలదు, తగదు.

పొగాకును ఏ రూపములో వాడినప్పటికీ ఆరోగ్యం పాడవుతుంది. భయంకర మైన వ్యాధులు వస్తాయి. కనుక వాటి జోలికే పోవద్దని హెచ్చరిస్తుంది ఈ పద్యం.

76.ఇన్ని పోలికలను ఎత్తి చూపితి నేను
పిరికితనము వదలి, పెంచుకొనుము
ధైర్య సాహసాలు, లే, లెమ్ము, వేవేగ
నీదు ఆశయమ్ము నిర్ణయించు.

77.చిర్రుబుర్రులాడి చీకాకు పడబోకు
నీదు కోపమెపుడు నీకె హాని
నీకు నచ్చనట్టి నిందలు, మాటల
నిగ్గుదేల్చ దలచ నడ్డి విరుగు.

78.అధిక రాయితీలు అదిరెడు డిస్కౌంట్లు
రోజు కొక్క బోర్డు రోత పుట్ట
ఆను లైను లోన ఆఫర్లు వలతాళ్లు
ఉచిత కాన్క లగును ఉరులతాళ్లు.

79.వేగ కొనుడు ఒకటి, వేసుకొను డయిదు
ఆదివారమంత ఆఫరుండు
ఇంటి కడకె దెచ్చి ఇచ్చెద మమ్మలూ
వాయిదాల జమల వీలు కలదు.

80.పట్టణాలు మురికి పట్టులై పోవగా
కడకు గాలి, నీరు కలుషితంబు
వేల వెర్రి కలలు వేగంపు బతుకులు
కరుణ, ప్రేమ, దయలు కరవులయ్యె.

81.తడిసినట్టి చెత్త తడవని చెత్తలు
వేరు చేసి చేర్చు వీధి కుండీ
ఇరుగు పొరుగు నెపుడు ఇబ్బంది పెట్టకు
పురము శుచిగ యుండు పౌరులార.

82.లేదు తరుగు, మరియు లేదు మజూరియు
పాత, కొత్త నగల మార్పు కలదు
రకము చూచి కొనుడు రత్నాలు, వజ్రాలు
తారలంత సాక్షి తరలి రండు.

83.మగ్గముల ధరలకు మేమమ్ము చున్నాము
కంచి, ధర్మవరము, పోచము పల్లియు
ఉప్రయూరు, సూరతు ప్పాడ, రకములు
కలవు మంగళగిరియు కారు చౌక.

84.పిల్లవాండ్రు కారు పిడుగులు బాలలు
అక్షరాల కన్న ఆటలన్ని
ముందు నేర్వ గలిగె ముంజేతి ఫోనులో
అమ్మఅయ్యలెంతొ హర్షమొంద.

85.తడబడ అడుగుల బుడతడు మూడోయేట
వడివడిగను ఏబి బడిని చేరె
పుస్తకములు, బూట్లు, దుస్తులు, టైకట్టి
మూడుగాళ్ల బండి ముందు ఎక్కె.

86.పొరుగు ఇరుగు తోడ పోల్చుకొనుచు
వారు చేసినట్లు మీరు చేయ
నక్క పులిని పోల్చి పెక్కు వాతలుపొందె
నీదు రూక రాకను నిక్కమెరుగు.

87.విరివిగాను కొనకు వినియోగదారుడా
ఉచిత కానుకలన్ని ఉత్త డాబు
ఆఫరులును, హామి ఆకర్షకవలలు
ఏది నీకు వలయు నదియె కొనుము.

88.చౌక గనక కొనకు రూకలు జాగ్రత్త
పెట్టె జూచి వలదు పెట్టుబడులు
మాయ కబురు నమ్మి మోసపోదు జ్ఞాని
సరుకు నాణ్యతలును సరిగ జూడు.

89.కండ్ల కావరమున కుందేలు ఓడెను
కూర్మమెదుట చిన్న కునుకు దీసి
శక్తి యున్న తగునె యుక్తి కూడ వలయు
సరస విరసమాడు సముల తోడ.

90.అడవిగింజ కాశ పడిన పావురములు
చిన్నమాట కొరకు చిక్కె వలను
సంఘబలము తోడ సఖుని చేర
చిన్న ఎలుక కాచి వన్నె కెక్కె.

91.కుక్క సరిగ కాపు కాయలేదని
హెచ్చరించె ఖరము హెచ్చు గళము
విసిగి లేచి మాలి విరగగొట్టె నడుము
జనుల పనుల యందు జోక్యమేల?

92. తమరి సంతు కన్న తనయుల సంతుపై
ప్రేమ, కరుణ, జాలి పెక్కు యుండు
తాత, అవ్వ కెపుడు తధ్యమీ యిలయందు
అసలు కన్న వడ్డి అగును తీపి.

93. కుక్క తోక వంపు కుదురునా సరిచేయ
నక్క జిత్తు మార్చ నీకు తరమ?
చిక్కులోన పడకు చిలిపికోరికలతో
హద్దు, పరిధి నెరిగి హక్కుజూపు.

94.జాస్తి డబ్బు యున్న జాతి కుక్క కొనకు
దాని తోక ఊప, దారి జూప
నేర్వవలయు ముందు, నేర్పవలయు తుది
పొరుగు వారి జూచి పోల్చు కొనకు.

95. చిర్రుబుర్రు పెరుగ చింతలు ఎదుగును
కోపతాపములను చూపకెపుడు
వేచిచూచి బాగ వేయుము అడుగులు
నీకు జయము కలుగు నిశ్చయంబు.

96. నక్కజిత్తు, కుక్క నమ్మకాల నెరుగు
పాము పడగ, దాని పరిధి చూడు
చూడు వేప చేదు, చోద్యమగును
వివిధ తీరులయ్య విశ్వ రీతి.

ఒక సినిమా కవి స,రి, గ, మ, ప, ద, ని - అనే ఏడు అక్షరాలతో  ఒక సందేశాత్మక పాట ఎలా రాశాడో చూడండి.భర్తతో భార్య అంటున్నదట.

నీదారి మాని నీ మానిని దారిని పద
పాపమని, సాగనిదని - నీ సగమని, సరిదానిని గని
పగమాని దారి మారి పద - సదా నీ పాదమాని మనిద

మామగారి పగ గాదని – నీ మదమని నీ పాపని గని
నీ దాని సరి మగనిగా – గరిమగా,  మగసరిగా.నీ దారి.

మరి మరి, పరిపరి, సరిగ, నీ దగా మాని
నీ దగా మాని  మామగారిని గని
నీ దారి మారి సరిదారిని పద
సమసారి దారిని సరిగా పద.      .నీ దారి.